

# రామచంద్రశతకము

శ్రీరమాధీవిభుండుసరసీరుహనేత్రుడు రామమూర్తి యి
ద్ధారుణి కొప్పునూరుపురధాముడు నై చెలువొందుచిన్నిశ్రీం
గారకులాబ్ధిసోముడగు కాశయ కిష్టఫలంబులిచ్చి యా
పూరజెలంగు వర్తకుల నొప్పుగ। బ్రోచు ముదంబుమీరగన్ ౧

సీ॥ శ్రీరామపదపద్మ సేవాధురీణులై చెన్నొందిరిద్ధాత్రి
చిన్నివారు। సన్నుతాచారులై సత్యప్రవీణులై చెలగిరికీర్తి చేచిన్ని
వారు। దానరాధేయులై ద్రవ్యసంపన్నులై। జెల్వొందుచుండిరి
చిన్నివారు। వార్ధిగాంభీర్యులై వైభవోపేతులై। చిత్తజాకా
రులీ చిన్నివారు। అట్టివరచిన్నివంశసుధాబ్ధిసోము। డగుచు।
రాణించె వైశ్యులందగణితముగ। కొప్పునూరిపురంబులో।
గురుతరముగ। క్షేమవంతుండు యల్లయ్యనామఘనుడూ॥

గీ॥ ఆమహామహునకు భార్యయై ధరిత్రి। కీర్తిజెందెను దాన
విస్ఫూర్తిచేత। సద్గుణంబుల సావిత్రి సదృశయగుచు। మించె
కనకాంబ శిరులచే నంచితంబూ॥

ఆవధూవరులకు గల్గి రనఘమతులు। బంధురాకారు
లతులిత బాహుబలులు। జగతి సరువయ్య గురువయ్య సరసు
లెన్న। మించి రకళంక పదవుల నంచితంబూ॥

క॥ సరనయ్యకు తరుణీమణి। నిరతము పతిహితముచేత
నగడధరిత్రి। స్వరకోటాంబిక సుగుణా। కరయైవర్ధిల్లె సకల
కల్యాణములన్.

క॥ గురువయ్యకు సతియై సుం। దరమున దమయంతి యనగ ధరణీస్థలిలో। విరివిగ సద్గుణములచే। మెరసియు కృష్ణాంబపతికి మేలొనగూర్చెన్॥

గీ॥ వినుతమతియైన కృష్ణాంబ విమలగర్భ। శుక్తిముక్తాఫలంబులై సొంపుమీఱ। గలిగిరకళంక చరితులై విలసితమగు। వేదముల రీతిమించిరి వేడ్కలలర.

సీ॥ కవికల్పవృక్షమై ఘనతరోదారుడై వర్థిల్లె కాశయ్య వైభవమున। సత్యమందున హరిశ్చంద్ర సమానుడై ప్రబలె నాగయ్య శోభనములలర। సుందరాకారుడై మందరధీరుడై విలసిల్లె సుబ్బయ్య వేడ్కలలర। వార్థిగాంభీర్యుడై వర్ణితాచారుడై రసికుడై రామచంద్రయ్య మెరసె। ముత్తియము లెల్ల నొక్కచో మత్తినట్లు। మోరకులగోత్ర పావనుల్ చారుమతులు। దనరుచుండిరి కీర్తిచే మనుజులెన్న। విరివిగా చిన్నివంశ పవిత్రులగుచు.

సీ॥ వొప్పుగా తమయింటి యుత్తరమునశాస్త్రోక్తముగ గట్టించిరి విమలమైన। రామమందిరము రారాజులు మెచ్చగా నద్దేవతాస్థాన హార్మ్యమెన్న। నలవియే సుజనులకదిగాక తత్పురి నడివీధిలో బావి కడుముదమున। త్రవ్వించి రత్యంత దాక్షిణ్యవంతులై దాని యగాధంబు దలపవశమె। ధరణి జెలొందిదాతలగుచు। వన్నెజెందిరిగద చిన్నివంశమందు। వర్తకులు మెచ్చ మిగిలిరి వైభవమున। ధార్మికులు భాగ్యవంతులు దానయుతులు.

క॥ అందగ్రజుడౌ కాశయ కిందీవరనేత్రియైన సుందరి యగుచు। న్నందితయై శోభిలెశుభ। మందిరయగు రామ

లక్ష్మమాంబ ధరిత్రిన్.

క. ఆదంపతు లిద్దరు కడు । మోదంబున వ్రతమునల్ప మురజిత్కరుణన్ । మేదినిగలిగిరి తనయులు । వేదాంత విచారులతుల వీర్యులుదారుల్.

సీ॥ కమనీయమూర్తియై కల్యాణవర్తియై విలశిల్లె మల్లయ్య లలితయశుడు । మదనసౌందర్యుడై పెదరామ చంద్రయ్య సత్కీర్తిజెందెను సంతతంబు । శ్రీరామభక్తుడై చినరామ చంద్రయ్య మించె శోభనముల నంచితంబు । బాలచంద్రుని మాడ్క బ్రబలి రిత్రాత్రిలో గుణవంతులగు వైశ్యకోటులెన్న । భూరిసామ్రాజ్యవంతులై బుధనుతులయి । దనరె రకలంక చరితల వినయులగుచు । కన్నికాదేవి కరుణచే కలియుగమున । బొదలి రతులిత భవ్యసంపదలచేత॥

గీ॥ వారిలో మల్లయాఖ్యుని వనితయగుచు । రహిని జెలువొందు సత్యనారాయణమ్మ । బుట్టె పందిరి వీరయ్య పుత్రియగుచు కమలతో సరియానని కమలబల్క॥

గీ॥ సప్తసంతానములు సల్పి సాధుజనుల । బ్రోచువర విన్ని కాశయ్య బుధసుతముగ । రామశతకంబు జెప్పించె రమ్యముగను । తనయశం బిలలోనుండునని తలంచి॥

క॥ ఈ వంశావళి జదివిన । భావంబున రామవిభుని ప్రార్థించినచో । భూవలయంబున జనులకు । కేవల సంపదలు గల్గు కిల్బిషహారమా॥

# శ్రీరామచంద్రశతకము.

## చంపకమాల వృత్తములు.

మనమున మాటల క్రియను మానక నీచరణద్వయాంబుజా
ర్చన గలుగంగజేసియు యవిద్యయు బాపియు వేగ నీవు న
న్ననిశము బ్రహ్మబోధమున కౌశలు జేయవె విష్టరశ్రవా
ఘనుడగు చిన్నికాశయనుగాచిన శ్రీరఘురామచంద్రమా॥ ౧

మామకు కన్నులిచ్చి యొకమానును గర్వమణంచి దుష్టుడౌ
మామను సంహరించి రణమందున వైరుల ద్రుంచి యెన్నికా
మామను రాజజేశితివి మాధవ భద్రనగాధినాధ యీ
భూమిని చిన్నికాశయను బ్రోచిన శ్రీరఘురామచంద్రమా ౨

గురుతర రోగబాధలను గుందుచు నెక్కడదోచక౯ భవ
చ్చరణము లాశ్రయించితిని శౌరి కృతార్థునిజేసి నన్ను నీ
నిరుపమమైన సన్నిధిని నిల్పుమటంచు నుతింతు బ్రోవవే
కరుణను చిన్నికాశయను గాచిన శ్రీరఘురామచంద్రమా॥ ౩

తనయుడు జేయుతప్పులను తండ్రి క్షమించినరీతి నన్ను నీ
తనయునిగా దలంచి ఘనదండన జేయక నన్ను బ్రోవవే
దినకరచంద్రనేత్రనుత దివ్యచరిత్ర పవిత్రగాత్ర వే
గను మును చిన్నికాశయను గాచిన శ్రీరఘురామచంద్రమా ౪

శరణనివచ్చిరేని రిపుసంఘములైనను గాతునన్న నీ
వరమప్రతిజ్ఞ సత్యమని ప్రార్థనజేసితి భద్రశైలమం
దిరకరుణాలవాల శుభదివ్యగుణాకర భక్తపాలనా
మురహార చిన్నికాశయను బ్రోచిన శ్రీరఘురామచంద్రమా॥ ౫

సనకసనంద నాది మునిసన్నుత నీమహనీయ రూపము
న్ననుగొన నెంతవాడనను గావవె నా మొర యాలకించవే
నినుభజియించువారలకు నిత్యసుఖంబొనగూడకుండునా
ఘనముగ చిన్నకాశయను గాచిన శ్రీరఘు రామచంద్రమా॥౬
గురుతరమైన యీ యొడలు గొప్పవి పద్దశనొంది చిక్కెవా
క్స్వరము నూనమయ్యెనహహా బధిరత్వము సంభవించెనో
గిరముకొలంతియయ్యె జరిగెన్నత కాలము నీవె నాకుది
క్కరయ భవత్పదంబులతి హర్గమున న్విడజాలనయ్య స
త్కరుణను చిన్నికాశయను గాచిన శ్రీరఘురామచంద్రమా॥ ౭
సరసిజనాభనిన్ను గనజాలక చచ్చుచు పుట్టుచుండుదు
శ్చలితుల జూచి జన్మమె యసహ్య మటంచు భవత్పదంబులం
విడివిగసమ్మిమీ భజన వేమర కుండితి నన్ను బ్రోవవే
కరినుత చిన్నికాశయను గాచిన శ్రీరఘురామ చంద్రమా॥ ౮
మానవజన్మమెత్తి బహుమాయల నేను చరించుచుండి య
జ్ఞానముచే చెలంగి పరకాంతల గూడితి మోసమందితిం
బూనెదనీకృపారసము పొందుగ ముక్తి నొసంగవే దయాం
భోనిధి చిన్నికాశయను బ్రోచిన శ్రీరఘురామ చంద్రమా॥ ౯
నినునుతిజేయ శేషుడనె నీరజగర్భుడనే శివుండనే
మనుజులలోన దుర్బలుడ మానుషహీనుడ పాపకర్ముడ
న్మనమున గొల్తునే వినయ మారగన న్కరుణించి ప్రేమచే
గనుగొను చిన్నికాశయను గాచిన శ్రీరఘురామచంద్రమా॥ ౧౦
వ్రతములు జేసినం కనక వర్షమొసంగిన నీదునామ సం
స్తుతికెనజాలవంచు కడు శోభనమొప్ప నుతింతు నాకు స
ద్గతి దయచేసి బ్రోవవె సుఖప్రదభక్తచకోర చంద్రమా

నతతము చిన్నికాశయను సాదిన శ్రీరఘు రామచంద్రమా। ౧౧
జలధర దేహనీకృపకు సాగిలి మ్రొక్కితినన్ను బ్రోవవే
నలలిత వాక్యజాలబుధ సన్నుత శీలదయాలవాల ని
ర్మలతరఖేల పంక్తిగళ మస్తకబృందవిఘాలనిన్ను నే
గొలచెద చిన్నికాశయకు కోర్కెలొసంగిన రామచంద్రమా౧౨
సురుచిరమైన భోగమును శోభనజాలములియ్యమంచు నీ
చరణసరోజముల్ మదిని సన్నుతిజేతు నిరంతరంబునా
మొరవిని రావదేమి నను మూర్ఖునిగాను దలంచితీవున
త్కరుణను చిన్నికాశయను గాచిన శ్రీరఘురామచంద్రమా॥౧౩
నిరుపమమైన నీకథలు నేర్పున పద్యగవిత్వధాటిచే।
ధరణిరచించినందులకు దాసుని నన్ను కృతార్థుజేయవే।
నరవరకైటభాంతక జనార్దన భక్తఫలప్రదాకా।
కరుణను చిన్నికాశయను గాచిన శ్రీరఘురామచంద్రమా॥ ౧౪
వనజభవాండ పంక్తులను వాసవవందిత నీదుగర్భమం।
దున నొకమాటుదాల్చి పరితోషితచిత్తమున న్వెలుంగుమా।
జనకుడవైన నీమహిమ శంకరుకైనను తింపశక్యమే।
మనుమని చిన్నికాశయను మాటికినేలిన రామచంద్రమా॥
కలుషలతాల విత్రభవకార్ముక భంజనమాని మిత్రని।
ర్మలతరవేష భక్తజనమానిత శీలదయాలవాలమం।
జులదరహాస సత్వగుణశోభిత కాంచనచేలమాధవా
బాలుపుగ చిన్నికాశయను బ్రోచిన శ్రీరఘురామచంద్రమా॥
ధరనుత మంగళాంగ గజతాపవిమోచన మానిసంగ ని
ర్జరహితకార్యసాంగ కవిసంస్తుత భవ్యదయాంతరంగమా
ధురతరవాక్ప్రసంగ రిపుదోర్బలభూరితమఃపతంగ స

త్కరుణను చిన్నివాశయను గాచిన శ్రీరఘురామచంద్రమా॥
విరివిగ నిన్నుబోలు కడువేలుపులెవ్వరు నింగిజాలు నీ
చరణములం జనించెనని స్నానముజేతురు దేవతాళిస
త్పరమ పవిత్రమూర్తి వయిభాసిలు నిన్గొనియాడశక్యమే
కరుణను చిన్నికాశయను గాచిన శ్రీరఘురామచంద్రమా॥౧౦
అరమరసేయనేల నిపుడాదరమొప్పగ నన్ను బ్రోవవే
కరివరుమున్నుగాచుగతి గాచెదవంచు కృతుల్రచించి నీ
చరణము లాశ్రయించితిని చారుపయోదశరీర మాధవా
కరుణను చిన్నికాశయను గాచిన శ్రీరఘురామచంద్రమా॥౧౧
కరువలిపట్టినిన్నుహనుని కాకినిదంతిని యంబరీషువా
నరపతినేలినావనుచు నమ్మితి నామొరలాలకించవే
నిరతమునిన్ను వేడినను నీకృపరాదిక నేమిసేతు స
త్కరుణను చిన్నికాశయను గాచిన శ్రీరఘురామచంద్రమా॥
సరసిజసంభవాండములు సాదెటి దాతకు నన్నుబ్రోవదు
ష్కరమె కృతాపరాధుడను గావ కటాక్షము రాకయున్నదో
మరిమరివేడితే దురభిమానము నీకిపుడేలగల్గు స
త్కరుణను చిన్నికాశయను గాచిన శ్రీరఘురామచంద్రమా॥
మ॥ శరణంటిం దరిజేర్చుమంటి కృపచే సామ్రాజ్యమిమ్మంటినా
దురితంబుల్విడగొట్టు మంటి ఘనచేతో మోదమిమ్మంటి మ
ద్గురువర్యుండవటంటి తత్క్షణమున నోకార్థమిమ్మంటి స
త్కరుణన్బ్రోవవె కొవ్వునూరి పురిసీతారామధాత్రీశ్వరా॥ ౨౨
వరదుడవైననేమి ధనవంతుడవైనమరేమి కౌస్తుభా
భరణుడవైననేమి బలవంతుడవైన పనేమి మమ్ముల
న్నిరవిగ నేలకున్న నిను వేడుదు నాఖగరాడ్తు రంగ స

త్కరుణను చిన్నికాశయను గాచిన శ్రీరఘురామచంద్రమా। ౨౩

బిసరుహ గర్భతండ్రివయి ప్రేమ దలిర్పగ వద్దికాసులం
వెసగొనినట్టి నిన్నుగని వేడిన ద్రవ్య మొసంగువాడవే।
రసికుడవంచు వేడినను రావొక కొండనుజేరి కేశవా
కరుణను చిన్నికాశయను గాచిన శ్రీరఘురామచంద్రమా ౨౪

వనగల మత్కవిత్వమును ప్రాజ్ఞులకిచ్చిన మోసమంచు నా
రసుడగు వైశ్యరత్నమయి రాజలు కాశయకిచ్చి తీక్ష్ణతి
న్నొకసరితి నీదయామృతము గోపతినందిత నన్నుబ్రోవవే
వసుమతి కొప్పనూరిపురివాసర మేశ్వర రామచంద్రమా ౨౫

పెనగెటి కర్మజాలముల పెంపునడంచి ముదంబు మీర నీ
వనుపమ భాగ్యమిచ్చెటి మహాత్ముడవంచు దలంచి మిమ్మునా
మనమున గొల్తు నిప్పుడనుమానము లేకనునన్ను బ్రోవవే
మనుమనిచిన్నికాశయను మానుగ నేలిన రామచంద్రమా ౨౬

జనకుడు బ్రోవకున్న మది జాలియొకింతయు లేకయున్న త
జ్జననియె గాచుగాన మము సాదెటి భూతల జాతకున్వొస
న్వినయముతోటి నీవుశలవిచ్చిన తక్షణమందు నేలదా
ఘనుడగు చిన్నకాశయను గాచిన శ్రీరఘు రామచంద్రమా ౨౭

సతతము నిన్నువేడినను సత్కృతు లిచ్చిన నిర్దయామతిం
వితతదరిద్ర వేదనల విశ్వములోన కృశించుచున్న నా
కతులితభోగ సంపదలనైన నొసంగ విదేమివింత ప్ర
స్తుతగుణ చిన్నికాశయను సొంపుగ నేలిన రామచంద్రమా ౨౮

జలనిధి మేరదప్పినను శంభునిశూలము పోటుదప్పినన్।
న్నలినజువ్రాత దప్పినను నాగకుల ప్రభుకాటు దప్పినన్
గలశజుమాట దప్పినను కంతునిబోలిన చిన్నికాశయన్
భళిపలుకాడిదప్పడని వాసిగ నేలిన రామచంద్రమా॥ ౨౯

కోసరితి నీ దయామృతము గ్రోలితిని నీపదకంజతోయము౦
కొసరితి నీ ప్రసాదమును కోరిభుజించితి చక్రహస్తయీ
వసుమతిలో నదీనజన వర్గము నేలిన పద్మనాభసా
రసుడగు చిన్నికాశయను రక్షణజేయవె రామచంద్రమా॥ ౩౦
తెగువతనంబుతో వెదకి తేలునుబట్టి తపించురీతినీ
జగతిని దుఃఖవేదనల జాలముబొందితి మోసమొందితిం
ఖగపతి వాహనోత్తముదకు గంటిని నీమృదుపాదకంజము
ల్నగధరచిన్ని కాశయకు నాకమొసంగవె రామచంద్రమా. ౩౧
పతితజనాళి మోక్షపద పద్యములల్లితి పొట్టకోసమై
సతతమునీ చరిత్రములు సత్కవితం రచియించనైతి ఘు
ర్గతికిభయంబు జెందినిను గాంచితినా మొరలాలకించవే
హితమతి చిన్నికాశయను హెచ్చుగనేలిన రామచంద్రమా.
నినునుతిజేయ గానజుడనే పురుహూతుడనే నరుండనే
ఫణిపతినే భవత్కృతులు భక్తిరచించిన దాసదాసుడన్
మనుజులలో నదుర్బలుడ మానక నిన్భజియింతు బ్రోవవే।
ఘనముగ చిన్నికాశయనుగాచిన శ్రీరఘురామ చంద్రమా॥ ౩౩
మొక్కితి వేడుకుంటె నృపముఖ్యుడ వంటిగురుండవంటినా
చిక్కులుబాపుమంటి సురశేవితమూర్తి వటంచు గొల్చితే
చక్కగజూడవైతి వెటుసైతును భవ్యదయాంతరం గపె
న్మక్కున చిన్నికాశయను మాటికినేలిన రామచంద్రమా॥ ౩౪
గ్రోలెదనీ కథామృతము గ్రోలెదనీ పదకంజతోయము
మేలగుజాతి పీవనుచు మతిన్మతినిచ్చినాడమా
పాలిటదైవమీవనుచు ప్రార్థనజేసితి నన్ను బ్రోవుజా ౩౫
గేలను చిన్నికాశయను హెచ్చుగనేలిన రామచంద్రమా॥

సారసనాభ నీ కృపకు సాగిలి మ్రొక్కితి నన్ను బ్రోవవే
కోరితి నీ వరంబులను కూరిమిచే నను గాంచుమంచు మం
దారప్రసూన బృందముల తప్పక నీపదపూజ జేతు ని
ద్ధారుణి కొప్పునూరి పురధామ రమేశ్వర రామచంద్రమా. ౩౬

చిక్కితి వేడుకుంటి నను చిక్కులు బెట్టకుమంటి నీవె నా
చక్కని సామివంటి నను సాదెటి తండ్రివి నీవటంటి నే
టక్కులు బల్కనంటి నను డాసి కృతార్థుని జేయుమంటి నే
గ్రక్కున చిన్నికాశయను గాచిన శ్రీరఘురామ చంద్రమా. ౩౭

సన్నుతశాలివీవె గుణిసంపదలందున పెద్దవీవె యా
పన్నుల దాతవీవె మును భక్తుల బ్రోచిన దైవమీవె నీ
కన్న మహాత్ము డేడి నినుగాంచి కృతార్థుడనౌదునంచు ని
న్నెన్నెద కొప్పునూరినగరీశ్వర రామనృపాలచంద్రమా॥ ౩౮

దోసిలి యొగ్గినాడ కడు దోసముల న్మను జేసినాడ నీ
దాసుడ దాసదాసుడను దాతవె నీవని నమ్మియున్న నా
యాసము లేలగల్గు భవదాజ్ఞ మెలంగితి నన్ను బ్రోవవే
వాసిగ కొప్పునూరి పురవాస ధురంధర రామచంద్రమా॥ ౩౯

మకరము చేత చిక్కుబడి మత్తగజేంద్రుడు నిన్ను వేడగా
చకచక నేగి చక్రమును సాహసమొప్పగ వైచినంతలో
వికవికలై ధరంబడగ విహ్వలుడై మకరేంద్రుడప్పుడే
ప్రకటిత కొప్పునూరి పురవాస జనార్దన రామచంద్రమా॥ ౪౦

కమలజసంభవుండు మును గాఢసుషుప్తిని జెందియుండగా
కుమతుడు సోమకాసురుడు కుట్రతనంబున వేదపంక్తిన
క్రమముగ చోరవృత్తిగొని కంధిని జొచ్చిన మీనరూపమై
విమతుని ద్రుంచి మిన్కులను వేధకొసంగవె రామచంద్రమా॥

సురలున్దానవులు న్పయోధిదగువన్సొంపొప్ప మంధానమా
గిరివారాశి మునుంగగా కమఠమై కేల్మోద్చు దేవాళి న
త్తఱి రక్షించి సుధారసంబిడిన మాదైవంబ వీవేకదా
కరుణన్ప్రోవవె కొప్పునూరిపురి సత్కంజాక్ష రాట్చంద్రమా॥

నిరుపమధర్మమార్గమున నీతులుజెప్పెడి సూనుఁబట్టి దు
ష్కరమగు బాధపెట్టుటనుగాంచి యనంతనృసింహరూపమున్
విఁవిగదాల్చి కంబమున విక్రమమొప్పజనించి శాత్రవో
దరమునుజీల్చి డింభకుని ధన్యునిజేయవె రామచంద్రమా॥ ౪౩

అదితికిబుట్టి వామనుడవై దనుజారికి కేలుజాచి త
త్పృథివిని మూడుపాదముల భీమబలోన్నతి నాక్రమించి సం
పదలు బలారికిచ్చి యశుభంబులద్రుంచిన మూర్తివీవె సం
పదగల కొప్పునూరి వరపట్టణ రామనృపాలచంద్రమా॥ ౪౪

దుర్జనులైన రాజులనుద్రుంచి పరాక్రమమొప్ప కార్తవీ
ర్యార్జునుసి న్వధించిన సుధామరకోటి ముదంబుజెంద శౌ
ర్యార్జితద్రవ్య మొక్కఘనయజ్ఞము కిర్పణజేసితీవెకా
నిర్జరవంద్య భార్గవ మునిస్తుత రామనృపాలచంద్రమా॥ ౪౫

గారవమొప్పకో సలజగర్భమునందు జనించి పూర్వబృం
దారకులన్వధించి ఘనతాపస వృత్తివహించి కీర్తిది
క్పూరితమైవెలుంగ నృపపూజ్యతనొందిన రాఘవేంద్రమా
కోరికలిచ్చి బ్రోతువని కోరితి రామనృపాలచంద్రమా॥ ౪౬

హాలము సలాయుధంబులను హాస్తములన్ధరియించి వైరి మం
డలములనెల్లగూల్చి మొయిడాలు శశాంకుని మించుచుండదో
ర్బలమున తేజరిల్లు యదువంశపవిత్రుడవీవెకాదె భూ
తలమున చిన్నికాశయను ధన్యునిజేసిన రామచంద్రమా॥

ఘనరుణబాధచే నెప్పుడు కష్టముజెంది యనేకదేశము
ల్వీనయముచే జరించి యవివేకముమాని భవత్పదాబ్జము
ల్మనమున నిల్పిగొల్చితిని మామక లోభములెల్లమాన్పవే
జననుత చిన్నికాశయను సాదిన శ్రీరఘురామచంద్రమా॥

గురుతరమైన వల్వలిడి కోమలి నేలిన రీతినన్ను స
త్కరుణను బ్రోతువీవనుచుగంటి భవత్పద పంకజంబుల
న్దురితవిదూర నీకృపకు దోసిలియొగ్గితి మమ్ముగావవే
నరగున చిన్నికాశయను సాదిన శ్రీరఘురామచంద్రమా॥ ౪౯

అరమరసేయనేల నిపుడొకటి కోర్వక నిన్ను వేడితి
న్వరివిగ నన్నవస్త్రములు వేడ్క నొసంగెటి దాతవంచునీ
చరణసరోజ యుగ్మమును సన్నుతిజేసితి బ్రోవవేదయ
న్కరుణను చిన్నికాశయను గాచిన శ్రీరఘురామచంద్రమా॥

ధరనిను వేడుచుంటినను సాదెటితెంక్రిడివి నీవటంటి సు
స్థిరమతిచేత నీభజనజేసెటి నన్ను తరింపజేయవే
ధరధర నీకుదాసుడను దానవదూరి ముకుంద మాధవా
కరుణను చిన్నికాశయను గాచిన శ్రీరఘురామచంద్రమా॥

దురితములు న్దొలంగుటకు దోసిలియొగ్గితి నన్నుబ్రోవవే
వరద దయానిధే పతితపావననామ సురేశవంద్య నీ
చరణముల న్భజించె దనుసాధుజనస్తుత భూరమేశశం
కరనుతపాదయుగ్మసిను గాంచి కృతార్థుడనైతి నేడు స
త్కరుణను చిన్నికాశయనుగాచిన శ్రీరఘురామచంద్రమా॥౫౨

స్థిరమతిచేత నీభజనజేయక ముష్కరులెల్ల ధాత్రిలో
నరకముకేగి బాధల మనంబులుతల్లడపాటుజెందిరం
చెరిగి నుతించినాడ మము నేలెడి దాతవు నీవటంటి స

త్కరుణను చిన్ని కాశయను గాచిన శ్రీరఘురామచంద్రమా॥ ౫౩
వరదుడవైననీవె సురవర్ణితమూర్తివి నీవెధారుణీ
శ్వరుడవు నీవెభక్తజన వర్యులనేలెటిదాతవీవె మద్గురుడవు నీవె
నీకృపకు దోసిలియొగ్గితి బ్రోతువంచు స
త్కరుణను చిన్ని కాశయను గాచిన శ్రీరఘురామచంద్రమా॥ ౫౪
స్థిరతరమైన నీపురము జేరుటకై భవదీయపాదము
ల్స్మరిపెము చేతగొల్చితిని ముఖ్యుడవీవని నమ్మియుంటినా
దురితముల న్హరింప వెస దోసిలియొగ్గితి నన్ను బ్రోవవే
కరుణను చిన్నకాశయను గాచిన శ్రీరఘురామచంద్రమా॥ ౫౫
కరివరునేలినాడవని కాకిని బ్రోచిన రాజవంచు ని
త్తరినిను నమ్మియున్ననను ధన్యునిజేయవె లోకనాధమం
దరధరవాసుదేవ ఘనతాపస తాప నివారమాధవా
కరుణను చిన్నికాశయను గాచిన శ్రీరఘురామచంద్రమా॥ ౫౬
కరమనురక్తిమందరము కవ్వముగా గొని నిర్జరాసురుల్
వరమతిచేత కంధిదరువన్ కమఠాకృతి దాల్చినట్టినీ
చరణములన్భజించెదను సత్యము దప్పక నన్ను బ్రోవవే
కరుణను చిన్నికాశయను గాచిన శ్రీరఘురామచంద్రమా ౫౭
ధరణిని బౌద్ధమూర్తవయి దానులనెల్ల తరింపజేయుగా
విరివిగమించినట్టి నినువేడితి నన్దయజూచి బ్రోవవే
సరసిజనేత్రమౌనిజన సన్నుతభవ్యచరిత్ర నేడు స
త్కరుణను చిన్నికాశయను గాచిన శ్రీరఘురామచంద్రమా॥ ౫౮
గరుడతురంగ నీవికను కల్కివనంజెలు వొందెదంచు నీ
చరణములన్భజించుటకు సాధుజనంబులు మోదమందగా
వరములొసంగవే భువిని వర్ణనజేసితి సత్యసాంద్ర స

త్కరుణను చిన్నికాశయను గాచిన శ్రీరఘురామచంద్రమా ౫౯

ధరవసుదేవపుత్ర ఘనధర్మచరిత్ర సురారిజైత్రసుం
దరతరగాత్రమా ధవబుధస్తవనీయ్య రమాకళత్రమం
దరధర శూలిమిత్రనను ధన్యునిజేయవె నిన్నుగొల్తు స
త్కరుణను చిన్నికాశయను గాచిన శ్రీరఘురామచంద్రమా ౬౦

పరమతి వేడినట్టి నను వంచనజేయక నేలుమంచు నీ
చరణములన్భజించెదను సాధుశరణ్య దయాలవాల భా
స్కరకుల భూషదేవముని సన్నుతమా మొరలాలకించవే
కరుణను చిన్నికాశయను గాచిన శ్రీరఘురామచంద్రమా ౬౧

మ॥ ధరణీన్రాఘువ నీకు శూలిహితుడై దాక్షిణ్యభావంబునన్
వరము ల్పెక్కున్నొసంగెనంచు నిను సేవజేంతు నన్నేలవే
సురరాజ్ఞోభగ ధురీణనీచరణము ల్సొంపొప్పగా నమ్మితి
న్కరుణంజూడవె చిన్నికాశయను వేడ్కన్బ్రోచు రాట్చంద్రమా॥

మ॥ వరగర్వంబున నిన్ను సాల్వుడు సభన్వంచింప దూషించు న
త్తరి ఖండించిన శౌర్యమూర్తివని నేధ్యానింతు నీనామము
న్నరసంస్తుత్యదయాలవాల భువిలో నన్నేలవే ప్రేమచే
ధరజెల్వొందిన సొప్పనూరిపుర సీతారామరాట్చంద్రమా॥ ౬౩

మ॥ సతతంబు న్భవదీయపాదములపై సాష్టాంగదండంబున
న్నతిగావించెద గావవే నను జగన్మాన్యప్రభావాఢ్య వం
దిత భర్మాంబర దీనరక్ష శుభసందీప్తాంగ రాజేంద్ర వం
దిత కల్యాణధురీణ రామవరపృథ్వీనాథ రాట్చంద్రమా। ౬౪

మ॥ వరమాప్తుండవటంచు మోక్షకరము ల్పద్మాక్ష నిన్నెంచెద
న్వరహాలెన్నిగణించెనేని విలసద్వైకుంఠముం జేరునా
నిరతంబు న్భజియింతు నీచరితము ల్నేరొప్ప వర్ణింతు న

త్కరుణ గ్రోవవె చిన్నికాశయను సీతారామరాట్చంద్రమా॥
మ॥ యిరవొందన్భవదీయపాదములు నాహృత్పద్మమందుంచిదు
ష్కర పాపాటవులెల్లగాల్చి ఘనభాస్వత్పుష్పబృందంబుసం
గురిగా నర్పణజేతు సంపదలు చేకూరంగ మన్నించి స
త్కరుణంజూడవె కొప్పునూరిపుర సీతారామధాత్రీశ్వరా॥ ౬౬
మ॥ దురితుల్గొందరు నిన్నుగూర్చి తపముల్ఘోరంబుగాజేసి నీ
వరముల్గైకొని దుర్మదాంధులయి నిన్వాదించిరట్లాడు త
స్కరబృందంబులదూరి నీకరుణకే కైవారముల్జేతు ని
త్తరి రక్షింపవె కొప్పునూరిపుర సీతారామధాత్రీశ్వరా॥
మ॥ కరమొప్పం చతురాననాండములునీ గర్భంబునందాల్చి స
త్వరజస్తామస ధారివైననిను సేధ్యాస్నించి యుష్మత్పదాం
బురుహంబుల్మదినిల్పు దిత్తెరిని నన్బోషింప గానీవెభా
స్కరవంశాంబుధి సోమరామ నరరాట్కంఠీరవా రాఘవా ౬౭
మ॥ శరధుల్గ్రాసిన మీనపంక్తి క్రియనీ సాన్నిధ్యమున్బాయ జా
లరమానాథను తాంఘ్రియుగ్మ హరినీలావణ్య మెన్నంగని
జకరబృందంబులకైన శక్యమె మహీశా రామ సీతాపతీ
కరుణంజూడవె కొప్పునూరి పురరాట్కంఠీరవా రాఘవా॥
నగరాడ్ధైర్య మృగేంద్ర శౌర్యను మబాణాస్తుత్య సౌందర్యవ
న్నగరాజస్తుతరాజవర్య నినుధైర్యంబొప్ప శేవితునే
ఖగరాడ్తుంగతురంగనీ దుడయకే కైవారముల్ జేతునీ
జగతీమండలి చిన్నికాశయకు మోక్షంబిచ్చు రాట్చంద్రమా॥
నిరుపమమైననీ కథలు నేరచియించిన నన్నుబ్రోవక
న్పరమదరిద్ర వేదనల బొల్పడజేసితి వెట్లుతాళుదు
న్వరదము కుందమాధవ భవస్తుత దివ్యచరిత్రబ్రోవవే

కరుణను చిన్నికాశయనుగాచిన రామనృపాల చంద్రమా॥ ౭౧
శరణనివచ్చి రేని రిపుసంఘము నైనను గాతునన్ననీ
పరమప్రతిజ్ఞ జూచితిని భక్తిరచించితి వృత్తపద్యము
ల్నిరతమునన్ను బ్రోవుమనినిన్ను భజించితిదీనపాలన
త్కరుణను చిన్నికాశయను గాచిన రామనృపాల చంద్రమా.
మొరవిన వేమిశేతు నృపము ఖ్యులు ధర్మము దప్పిరయ్యసం
గరములు సంభవించె కడుకష్టము చేత క్రశించిమానవు
లురుతరమైన రోగములగూలిరి తక్కినవారి నైనన
త్కరుణను బ్రోవవేవరద కౌతుకమొప్పగ రామ చంద్రమా॥
సరసిజనాభ యాచకులు సన్నుతిజేసిన బిచ్చమైన బె
ట్టరు మెడబెట్టి ద్రోయుదురు డాతురుదండము కేలబూనిభూ
వరుడవటంచు గొల్చితిమి వర్షము సంగగ మేఘుసంపవే ౭౮
కరుణను చిన్నికాశయను గాచిన శ్రీరఘురామచంద్రమా॥
పరమముదంబు మీరనిను ప్రార్థనజేసితి భక్తపాలనీ
చరణములాశ్రయించితి ని చారువయోధ శరీరగావవే
నరవరులెల్ల జూడమమునాకని వాసులజేసి భూమిలో
కరువునుమాన్పమంచు నిను గంటిక్షుతార్థునిజేసి బ్రోవవే
వరగునచిన్నికాశయను సాదిన శ్రీరఘురామచంద్రమా॥ ౭౯
కరుణను బ్రోచుతంత్రివని గాంచితి నిన్ను ముదంబుమీరము
న్నరివరుని న్విభీషణుని కాకిని బ్రోచి నరీతినన్ను నీ
పరమప్రతిజ్ఞ దప్పకను భవ్యకృతిన్గొని నన్నుగావవే
వరగున చిన్నికాశయను సాదిన రామనృపాల చంద్రమా ౭౬
వరకోపంబున నంబరీషనృపతి న్వంచింప దూర్వాసు డ
త్తరి నేతెంచిన నిన్నుగూర్చి మదిలో ధ్యాన్నింప రక్షించితో

పరమాత్ముండవు నీవె కావెభువి నన్పాలింపవే శ్రీధరా
ధరజెల్వొందిన కొప్పునూరిపుర సీతారామధాత్రీశ్వరా ౭౭

గురుతరమైన వల్వలిడి కోమలి నేలిన దీనరక్ష నీ
కరుణకు దోసిలొగ్గితిని కంజదళాక్ష ముకుందమాధవా
వరద దయానిధే పతితపావననామమునీంద్రపోషణా
సరగున చిన్నికాశయను సాదిన శ్రీరఘురామచంద్రమా ౭౮

గురుతరమౌవిపద్దశలగుందుచునీ చరణాంబుజంబుల
న్మరువక గొల్చుచున్న నయమార్గమొసంగవి దేమిచిత్రమో
సారనుతప్రచారహరి సోదర భవ్యదయాంతరంగ స
త్కరుణను చిన్నికాశయను గాచిన శ్రీరఘురామచంద్రమా ౭౯

వరదుడవైన నీవె మునివర్గముసీవె గురుండవీవె శం
కరుడవు నీవె భూతజనకాండము నీవనిభక్తిచేత నీ
చరణసరోజయుగ్మములు సంస్తుతి జేసిన నన్నుబ్రోవవే
సరగున చిన్నికాశయను సాదిన శ్రీరఘురామచంద్రమా ౮౦

మ॥ ధరలో వేల్పులనేకులుం గలరు నీధైర్యత్వమౌ దార్యసుం
దరచాతుర్యము లెరికైనగలవే దాక్షిణ్యచిత్తాబ్జభా
స్కరచంద్రద్వయనేత్ర దేవనుత నీసాంబ్రాజ్యమేమందు ని
త్తరి నన్నేలవె కొప్పునూరిపుర సీతారామ ధాత్రీశ్వరా ౮౧

కరుణంజూడు మహాత్మనిన్ను గనగాకాంక్షించి నీసాటిసుం
దరు లెందైనను లేరు లేరనిల సత్కళ్యాణ వాగ్ధాటిచే
శరణంటి న్మరికింపవే నను మహాసాంబ్రాజ్యధౌరేయశ్రీ
ధర దామోదర కొప్పునూరిపుర సీతారామ ధాత్రీశ్వరా ౮౨

కొరగాదన్న భవత్కథామృతము నే గ్రోలంగ వాంఛింతు నే
వరమాధుర్యకవిత్వమున్బలుకు దేవా రాసి గంభీరభా

స్కరచంద్రద్వయనేత్రనీ కృపకు నేకైవారముంజేతు ని
ద్ధరజెల్వొందిన కొప్పునూరి పురి సీతారామ పృథ్వీశ్వరా ౮౩

పురుహూతుండుభవత్పదాంబుజములన్పూజించిబల్మారునీనామ
ధురదివ్యామృతపానపారవశుడై దుర్మార్గులన్బట్టినం [మా
గరరంగంబున ద్రుంచిమించెనట నీకారుణ్యమేమందు ని
ద్ధరజెల్వొందిన కొప్పునూరి పురి సీతారామ ధాత్రీశ్వరా ౮౪

అరవిందాసన దేవతాళికి నీయౌదార్యగాంభీర్య భా
సురచాతుర్యములెన్నరా దనగనిం సొంపొప్పవర్ణింపము
ష్కరుడౌనాకు వశంబె ధాత్రినిల సత్కళ్యాణ ధౌరేయ శ్రీ
ధరనన్నేలవె కొప్పునూరి పురసీతారామ రాట్చంద్రమా ౮౫

వరదుండీశుడ వంచు నిన్నెపుడు నేవర్ణించియుమ్మత్పదాం
బురుహద్వంద్వముల న్భజింతు విలసద్భోగంబు మాకియ్యవే
వరచారిత్రరమాకళత్రనర దేవస్తోత్ర సద్వక్త్ర శ్రీ
ధరనన్నేలవె కొప్పునూరిపుర సీతారామధాత్రీశ్వరా ౮౬

శరమొక్క టెక్కుబెట్టినను శాత్రవుడాజినశించు నర్థికి
న్విరివిగ దానమిచ్చినను విశ్వములోన ధనీకుడౌను నీ
చరితము లెన్నశక్యమె ప్రసాదమొసంగవె భక్తపాల మం
దరధర కొప్పునూరిపురధామ ననుం గృపనేలు రాఘవా॥ ౮౭

పురుషుడు దర్పణంబొకటి పొందుగ సృష్టియొనర్చి దానిలో
గురుతరమైన రూపమును గొప్పగ గన్గొనురీతి నీచరా
చరములలోన వెల్గుదువు సర్వమునీవయి భూరమేశ స
త్కరుణను చిన్నికాశయనుగాచిన రామనృపాలచంద్రమా॥ ౮౮

స్థిరమతితో జగంబులను సృష్టియొనర్చి తదంతరంబులో
విరివిగ వెల్గుచుందువని వేడ్కనుతింతు భవత్పదాబ్జము

ల్గురుతరమైన నీమహిమ కుండలిరాజుకు నెన్నశక్యమే
సరసుని చిన్నికాశయను సాదిన రామనృపాలచంద్రమా॥ ౮౯

నరహరి నిన్భజించుటకు నారదమౌనికినైన శక్యమే
దురితుడనైన నామదికి దోచువిధంబున నిన్ను వేడితి
న్వరమొకటియ్యవే కలుషవర్గములున్నను జెందకుండ ని
ద్ధర విభవంబొసంగు మురదైత్యవిదూర నృపాలచంద్రమా॥

విరివిగ భూతకోటులను వేడుకమీరగ నాటకాని వై
ఖరిని నటింపజేతువు ప్రకాశగుణాకర భక్తపాల నీ
నిరుపమమైన మాయగనలేరక నల్వ భవత్సుతుండునై
బరగెను కొప్పనూరిపురిపాల ననుం కృపనేలురాఘవా॥ ౯౧

సరసిజనాభ నిన్నుగనలేక మానవులెల్ల ధాత్రిలో
బారిబారిజచ్చుచు న్మరల బుట్టుటజూచి నిరంతరంబు నీ
నిరుపమమైన సన్నిధిని నిర్మలసౌఖ్యమొసంగుమంటి స
త్కరుణను చిన్నికాశయనుగాచిన రామనృపాలచంద్రమా॥ ౯౨

మరణము జెందువేళలను మాధవ నీచరణాంబుజంబుల
న్మరతునటంచు నీస్మరణ మాటికి మాటికి నేటిదాక నే
గురుతుగజేసినందులకు కోర్కెలొసంగెదవంచు నమ్మితి
న్కరుణను చిన్నికాశయను గాచిన శ్రీరఘురామచంద్రమా॥

కడుసంసారపయోధిలోమునిగి దుష్కర్మంబులంజెంది యె
ప్పుడు దారిద్ర్యముచేకృశించితి మహిన్బొల్పొందసాంమ్రాజ్యము
ల్వడిగా నిచ్చెదవంచు వేడితిగదే వారాశిగంభీర నీ
యడుగుల్నమ్మిన బ్రోవవేమిటికి నిత్యానంద రాట్చంద్రమా॥

విరివిగ నీచరిత్రములు వేడ్కపఠించితి నీదుమంత్రము
ల్గురుకృపచే స్మరించితిని గోపతివంద్య పదారవింద స

త్కారుణను జూడవేమిటికి కల్మషము ల్విడగొట్టి బ్రోవవే
సరగున చిన్నికాశయను సాదిన రామనృపాలచంద్రమా ౯౫

అతులిత ధర్మమూర్తి వని యార్యులుని న్వినుతించిరంచు స
త్కృతులు రచించి నీకొసగితి న్కృపజూచి ముదంబుమీర సం
తతము శుభంబులిచ్చినను ధన్యునిజేయవె విశ్వతుంద శ్రీ
పతివని గొల్చు కాశయను పన్నుగనేలిన రామచంద్రమా॥ ౯౬

గురుకరుణా విశేషమున కొన్నికృతుల్రచి యించినాడత
స్కరుడనుగాను నీచరణకంజముల న్వినుతించువాడని
ర్జరనుత నన్నుబ్రోవవె ప్రసన్నుడవై కడుభాగ్యమియ్యవే
సరసుని చిన్నికాశయను సాదిన రామనృపాలచంద్రమా॥ ౯౭

సమ్మతితోడ నైకొనుము సారెకు వేడెద నీచరిత్రమే
నిమ్మహినుండగోరి రచియించితి మద్గురువర్యుడైన శ్రీ
తుమ్మలచెర్వు మల్లయను దోషవిదూరుని గొల్చినాడ క్షే
మమ్మున కొప్పనూరిపుర మందిర రామనృపాలచంద్రమా॥ ౯౮

కొండలరేనిబోలు సరికొండ కులాభరణుండ భట్టు వం
శుండల సత్కవిత్వనయ శోభితకోటమ రాజపుత్రుడ
న్పండితుడన్ నృసింహుడను భక్తిరచించితి వృత్తపద్యము
లుండగ నేనొనంగితిని ధన్యునిజేయవె దీనరక్ష భూమండలిలోన
కాశయను మాన్యతనేలిన రామచంద్రమా॥ ౯౯

ఘనమగు రామచంద్ర శతకంబు నిరంతరము న్పఠించు స
జ్జనులు కృతార్థులై సకల సంపదలంది యనంతరంబు వి
ష్ణుని సదనంబుజేరుదురు శోభనమొందుదు రిద్ధరిత్రిలో
వనజదళాక్షు సత్కృపను వాసిగమించుదురెల్ల కాలముల్॥ ౧౦౦

శ్రీసీతారామార్పణమస్తు

## కీర్తన

రామసద్గుణధామ శుభకామా । సూత్రామవందిత। నామవిభవస్తోమరణభీమా । ప్రేమమీర నిన్ను నేను వేమరు ప్రార్థించుచున్న నామొరాలించావదేమి నన్ను బ్రోవవేమి శేతు ॥రామ॥ ఘోరకల్మషదూరసువిచారా । సారాసనాభ సూరిజనమందార యుపకారా । మేరుగిరిధీర నానేరమూ లెంచాక నేడు కూరిమీచే గావకున్న నారాయణుండవేర॥రామ॥ మందరోద్ధరమారసుందరా । పూర్ణేందువదనా కుందరదన సనందనార్చితా సందియంబుమాని నిన్ను డెందమూన గొల్తు గోవిందము చికుందపోష వందనంబు జేతునీకూ ॥రామసద్గుణ॥ శీలశోభనజాలమునిలోలా । భూపాలవాలఖిల్యస్తోత్రవరచేలా । మేలొసంగి కరుణజూడ వేల భవ్యఖేలమా! పాలి దైవమానినిన్ను బ్రస్తుతింతురార వేగ॥ రామసద్గుణ॥ కన్నతండ్రివినీవె ఖగగామి। మన్నించవేనను సన్నుతింతును నిన్నునాసామీ । చెన్నుమీర కొప్పునూరి సీతారామచంద్రమా । చిన్ని కాశయాఖ్యునేలు పన్నగాశాయీవి నీవె ॥ రామసద్గుణధామ శుభకామా సూత్రామవందిత నామ నిభవస్తోమరణభీమా । ప్రేమమీర నిన్ను నేవేమరూప్రార్థించుచున్న నామొరాలించావా నన్నుబ్రోవ వేమి శేతూ॥

శ్రీ రామార్పణమస్తు.

## మంగళహారతి.

శ్రీరామరఘురామ శృంగార గుణధామ మంగళం జయ మంగళం॥ సారాసజనలోల సన్నూతవరశీల మంగళం శుభ

మంగళం॥ సత్యవాగ్భూషణ శాస్త్రావశోషాణ మంగళం జయ
మంగళం॥ మందరగిరిధీర వందితసువిచారమంగళం శుభమం
గళం॥ రతిరాజసుందార రమణీయ్యా కంధరమంగళం శుభ
మంగళం॥ పండితసన్మిత్ర భాసూర చారిత్ర మంగళం శుభమం
గాళం॥ ప్రహ్లాదసంరక్ష ప్రకటదుర్జన శిక్షమంగళం శుభమం
గళం॥ హారిసమరోష బ్రహ్మానందకర భావమంగళం శుభ
మంగళం॥ వర్ణిత కేయూ రవారాశి గంభీరమంగళం శుభమం
గళం॥ ధారుణివరకొప్పు నూరి సీతారామమంగళం జయమం
గళం॥ చిన్నకాశయనేలి జెల్వొందురఘురామ మంగాళం శుభ
మంగాళం.॥

శ్రీ రామార్పణం.